# తిరుమలేశశతకము

# విశ్వశాంతి

(భాస్కరరాయబారము)




గ్రంథకర్త:

అద్దంకి శ్రీరంగాచార్యులు,

యోగాచార్య

ఆంధ్రవిశ్వవిద్యాలయం,

వాల్తేరు.




[వెల : రు 5.00



కృతిపతి :

శ్రీ ఎమ్. ఆర్. అప్పారావు, M. A.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు కులపతి.

## కృతిసమర్పణ

## పంచరత్నములు

కృతిపతి :

**శ్రీ మేకా రంగయప్పారావుగారు**

ఆంధ్రవిశ్వకళాపరిషత్ కులపతి.

లలితమర్యాద సహృదయ లక్షణుండు,
రాచకులమున బుట్టిన రాజహంస,
సకలసద్గుణసంపూర్ణ సాధుమూర్తి,
ఆంధ్రవిశ్వకళాపీఠి నవతరించె.

రాయలే నేడు మన అప్పరాయ లగుచు
'విశ్వశాంతి'ని విశ్వంపు వీథులందు
వెలుగు లీనంగ జేయంగ వెడలివచ్చు
అప్పరాయల కీకృతి నప్పగింతు.

విశ్వవీథుల విహరించి వెతకి తెచ్చి
కథగ నల్లితి గీతను కలియబోసి
నవరసంబుల గలిపితి నవ్యరీతి
చవులు బుట్టించు నీకథ చదవ రండు.

పృథివి నాకొక రమణీయ పుష్పవనము
తేటినై దాన తియ్యని తేనె ద్రావి
తిరుమలేశుని ముంగల దెలిపినాను
వెనుకచూపుల నవి యన్ని వెలుగులీన.

ఆదరమున నాకృతుల మీ రందుకొనగ
ఆయురారోగ్యసంపద లందజేసి
కంటిరెప్పలా మిమ్ముల గాచుకొనుకు
రామమూర్తిని ప్రార్థింతు రాణయొప్ప.

ఆంధ్రవిశ్వకళా
పరిషత్,
వాల్తేరు.

ఇట్లు
కృతికర్త
అద్దంకి శ్రీరంగాచార్యులు.



గ్రంథ ఆవిష్కరణకర్త:
శ్రీ ఎమ్. గోపాలకృష్ణారెడ్డి, M. A., (Hons.) B. L.,
రిజిస్ట్రార్.



కృతికర్త:
అద్దంకి శ్రీరంగాచార్య

ఓమ్

శ్రీ రామాయ నమః

# కవితొలిపలుకు.

కవితకు ప్రేరణకావలెను. సృష్టిలోని ప్రతివస్తువు కవికి కథావస్తువే యగును. ప్రకృతి, పురుషపురుషోత్తములను తత్త్వత్రయము కవితకు నేపథ్యమేగాక పద్యముకూడాను. సృష్టిలోని రంగులన్నియు కవికుంచిలోనుండి వెలువడును రసములన్నియు నాతనికి ఆత్మానుభూతులు.

కవి కళల నన్నిటిని పెనవేసి కలిపి కట్టగల సంపూర్ణుడు; సర్వసమర్థుడు.

"అనురాగములేని మనసున సుజ్ఞానము రాదు" అనురాగములో నవతరించును సుజ్ఞానము; ఆవేదన, అన్వేషణ, ఆరాధన, సాధన. "పరమాత్ముడు, జీవాత్ముడు, పదునాల్గులోకములు, నరకిన్నరకింపురుష నారదాదిమునులు, పరిపూర్ణ, నిష్కళంక నిరవధిసుఖదాయక, వర త్యాగరాజార్చితవారము తాననే జ్ఞానమొసగరాద" కవి కీజ్ఞానమే మూలకందము, మూలాధారము.

బొంబాయిలో నాకుమారుడు చి॥ రామకృష్ణుని నివాసము బాంద్రాలోనున్నది. రెండువైపుల సముద్రము; అయిదవ అంతస్తు; రెండువైపుల బాల్కనీలు. సంధ్యాసమయములో నేను వర్ణించినప్రకారము:-

"రంగురంగులభంగుల । చెంగలించి
భాను డస్తమించుచునుండు । పశ్చిమమున"

ఒకరోజున ఈదృశ్యమును 'Pensive mood' లో తిలకించుచుండగా బొంబాయిలో ఉద్యోగము చేయుచున్న నా ముద్దుల మనుమడు చి॥ రఘుబాబు నాదగ్గరకు ఉత్సాహంగా వచ్చాడు. "ఈదృశ్యము చాలరమణీయంగా ఉన్నది; తాతయ్య! కవిత్వం తిరిగి ప్రారంభించు" అని హెచ్చరించి ప్రేరేపించినాడు. నాసహధర్మచారిణి చూడామణి పరమపదించిన తరువాత కొంతకాలము నిద్రాణములో బడిన నాకవిత నిద్రనుండి మేల్కొని పునరుద్భవించినది.

సూర్యాస్తమయంతో ప్రారంభమైన కథ చిలువలు పలవలై వలవలె కథగా నల్లుకొన్నది. విస్తరించి, విశ్వవీథుల విహరించి 'విశ్వశాంతి'గా రూపొందింది. పట్టిన కలము పట్టినట్టుగా పట్టువిడువక పద్యములు వెలువడినవి.

మా పెద్దల్లుడు చి॥ నరసింహాచార్యులు నాపెద్దకూతురు చి॥ సౌ॥ సీతాదేవి ఈపుస్తకముల ముద్రణకు ప్రోత్సహించి వారు ఉద్యోగములు చేయుచున్న అమలాపురమునకు చేరువనున్న భట్నవిల్లిగ్రామంలో ముద్రణచేయించినారు. వారికి నా ఆశీస్సులు.

నా ఈకృతులకు పతిగా నుండుటకు ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకులపతులు, అమృతహృదయులు శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారు M. A., అంగీకరించుట నాసుకృతవిశేషము. వారికి నాహృదయపూర్వక వందనములు.



కవి-రవుల కిరణపుంజములు సహృదయహృదయసీమల ప్రవేశించి విశ్లేషమై వర్ణవైవిధ్యముతో వెలువడిన అభిప్రాయములు కవికి హృదయానందకరముగా నున్నవి.

వారివారి అమూల్యమైన అభిప్రాయముల నాకందజేసిన మహామహితాత్ములు, మహాకవులు పండితు లందరకు నాకృతజ్ఞతాపూర్వక వందనములు.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకులపతులు శ్రీ మేకా రంగయ్యప్పారావుగారు M. A.; ముముక్షుమహాపీఠాధిపతి శ్రీ శ్రీ శ్రీ లక్ష్మణయతీంద్రులవారు; మహాపండితకవులు బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు; శ్రీమల్లాది గోపాలకృష్ణశర్మగారు (విమర్శనకళావాచస్పతి- విమర్శకాగ్రేసర, M. A. త్రియ Ph. D.); సాహిత్యరత్న Dr. K. రాజశేషగిరిరావుగారు (M. A. హిందీ; M. A. సంస్కృతము; M. A. తెలుగు Ph. D. ఆంధ్రకళాపరిషత్తులో హిందీపీఠాధిపతి); శ్రీ నేతి సూర్యనారాయణమూర్తిగారు M. A. భాషాప్రవీణ, Vice Principal, ఓరియంటల్ కాలేజి, ఏలూరు; భాషాప్రవీణ శ్రీ పాకల సూర్యనారాయణశాస్త్రిగారు; విద్వాన్ ఎమ్. అమ్మాయమ్మగారు; Dr. మోడేకుర్తి వెంకటసత్యనారాయణగారు (M. A. Ph. D. తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు); వాల్తేరు 'సాహితీమహతి' అధ్యక్షులు శ్రీ సూరపనేని శ్రీబాబుగారు; నన్ను పాఠకులకు పరిచయము జేసి నారచనలను పరిశీలనజేసిన నాచిరకాలమిత్రులు, సన్నిహితులు డాక్టరు శంకర శ్రీరామారావుగారు, ఏలూరు;

హిందీ సాహితీవేత్త శ్రీ మంత్రి నరసింగరావుగారు; శ్రీ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు M. A., Retd.Sanskrit Pandit; శ్రీశిష్టా సూర్యనారాయణగారు, M. A. Lecturer, S. K. B. R. College, అమలాపురం. శ్రీ M. గోపాలకృష్ణా రెడ్డిగారు, M. A. (Hons) B. L., రిజిష్ట్రార్, ఆంధ్రవిశ్వకళా పరిషత్, వాల్తేరు.-

ఈ అందరిమహానుభావులకు నావందనములు.

కథావివరణ నేను స్వయంగా చేయనవసరములేకయే ఈమహనీయుల అభిప్రాయములందు వివిధదృక్పథములతో వెల్లడిఅయినందున, నేను విశదీకరించుట చర్వితచరణమగును.

'విశ్వశాంతి'లోని వ్యాకరణదోషములను సరిదిద్ది నాకు సహకరించిన భాషాప్రవీణ శ్రీ పాకల సూర్యనారాయణ మూర్తిగార్కి, విద్వాన్ శ్రీమతి అమ్మాయమ్మగార్కి- నాకృతజ్ఞతాపూర్వకవందనములు.

నా ఈదృశ్యకావ్యములో ప్రధానపాత్రల ధరించి ఈ 'విశ్వశాంతి' నాటకమును జయప్రదముగా నటించిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు, వారిసతీమణులు- సరస్వతి, లక్ష్మీదేవి, పార్వతీతల్లులకు, ఇంద్రాదిదిక్పాలురకు, నారదాదిమునులకు, కథానాయకునిపాత్ర అతిసమర్థవంతముగా నిర్వహించినభాస్కరునకు,సూత్రధారుడు కవి శ్రీరంగనాథునకునాధన్యవాదములు.

ఇట్లు

అద్దంకి శ్రీరంగాచార్యులు.

తిరుమలేశశతకము

# అభిప్రాయములు.

## 1

ఎమ్. ఆర్. అప్పారావు ఎం. ఎ.
వైస్‌ఛాన్సలర్.

ఆంధ్రయూనివర్సిటీ,
వాల్తేరు,
విశాఖపట్టణము - 3
25-7-1979

శ్రీమాన్ అద్దంకి శ్రీరంగాచార్యులుగారికి,

మీరు రచించిన 'తిరుమలేశశతకము'లో మీమధురస్మృతులు మృదుమధురకమనీయకవితలో వ్యక్తీకరించబడ్డాయి. దైవభక్తి, దేశభక్తిపూర్వకాలైన మీఆత్మానుభూతులను పఠించుటవల్ల జీవితాన్ని ఏవిధముగా తీర్చిదిద్దుకోవాలో అందఱికి స్పష్టమౌతుంది. జీవితాన్ని సంపూర్ణముగా అనుభవించిన మీజీవితగమనం ఆదర్శప్రాయం. నిరపేక్షతో మీరొనర్చిన స్వాతంత్ర్యసమరం, మానవతావాదం ప్రశంసనీయాలు. దివ్యభావబంధురాలైన తిరుమలేశశతక పద్యాలు రసచషకాలు. ఏవంవిధగ్రంథరాజాల్ని అనేకాల్ని రచించి ఆంధ్రభాషను అలంకరించి ఆంధ్రావళి ఆమోదాన్ని పొందగలరని ఆశిస్తున్నాను.

నారు. జీవితములో ననుభవించునవన్నియు మధురములు - కటువులు
కూడ మధురములై తలంపున మెదలెడి దశనందిననాడే జీవితము లక్ష్య
సిద్ధి నందినదని ఎరుంగవచ్చును. అట్లు వీరు విషాదమధుర తారతమ్యము
లేక అన్నిటిని తియ్యని తలంపులుగా స్వామికి నివేదించుకొనగలిగిన
ధన్యజీవి శ్రీరంగాచార్యులుగారు.

వారి సౌహార్దము నాపై ప్రసరించి నాకీ మాటలు పల్కునట్టి యవ
కాశము కల్గించినది. ఆ మహాపురుషుని జీవితప్రభావము - సామాన్యులగు
నందరను సాకించి సన్మార్గమున నడపగలదు. అట్టి జీవితసారమగు
తిరుమలేశశతకము చదివి ఆనందించి నాభక్తిప్రహ్వమైన హృదయముతో
వారికి అంజలిఘటించుచు విరమించుచున్నాను. అందరును చదివి ధన్యు
లగునట్లు శ్రీ శ్రీనివాసు డనుగ్రహించుగాక. వారికి లోకకళ్యాణమునకై
దీర్ఘాయురారోగ్యములను స్వామి ప్రసాదించుగాక.

---

# తిరుమలేశ శతకము.

సీ॥ కత్తికిన్ దెగనట్టి కండరమ్ముల పుష్టి
సడలిపోయెనుగదా! సారము డిగి,
పచ్చి వక్కనయిన పచ్చడిగ నమలు
దంతాల పరువమ్ము ధ్వంసమాయె,
తుమ్మెదరెక్కల తోఁసిరాజనిపించు
కురులెల్ల రాతెగా కుదురు లడరి,
పువ్వు రాలిన జాలు పులకించి వినజాలు
వీనుల సోకదు పిడుగుధ్వనులు,
తే॥ గీ॥ కాయము జరాకృశంబయ్యె కాంతిబాసె
గడచిపోయె నాపడచుకాలమంత
బ్రతికియుంటి నే జీవచ్ఛవంబ నగుచు
తియ్యదనము తిరిగిరాద తిరుమలేశ! 1

తే॥ గీ॥ మాతృదుగ్ధము లానుచు మానముద్రి
దాల్చ నను లేపి కవ్వించు తల్లి జూచి
బోసినగవుల వెలుఁగున పులకరించు
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ! 2

తే॥ గీ॥ పసిడిబుగ్గల సుడులలో బలుకు కులుకు
తరుణహృదయాన వెలుగొందు తళుకుబెళుకు
కరకు నురుకుల కలకల మెరపు చురుకు
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ! 3

తే॥ గీ॥ తల్లి చేయూత గైకొని తగుదునంచు
తప్పటడుగులు వేసి నే తరలి వచ్చి
విశ్వవిజయోత్సవమ్మున విఱ్ఱవీగు
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 4

తే॥ గీ॥ పలకమీదను బొమ్మను పట్టిగీసి
పదుగురికిను జూపించి నే పరవశింప
చిత్రకళలను చిగురించు చిన్నతనపు
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 5

తే॥ గీ॥ వావి వరుసలు విడిచియు పాపలందు
ఆలుమగలన్న మాటల నాడువేళ
శైశవోత్సాహసల్లాప సంభ్రమముల
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 6

తే॥ గీ॥ అట్లతదియన బాలుర మంత కలిసి
పెరుగు నన్నము గుడిచియు పెచ్చురేగి
ఆటపాటల నాడుచు నరచునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 7

తే॥ గీ॥ మూలమూలలు గాలించి "ముసలిమొసలి"
యాటలాడుచు పెక్కగు నాకులంది
నృత్యశాస్త్రప్రగల్భాల నురుకునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 8

తే॥ గీ॥ కోకిలమ్మను వెంటాడి కొండలెక్కి
దాని గాంచక వేసరి దారిదప్పి
వాగుచెంతనే నడుమును వాల్చునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 9

తే॥ గీ॥ బడికిపోవు మార్గమ్మున పందె మిడుచు
పుస్తకములటు పడవేసి పోరుసలిపి
శత్రుదర్పంబు నడచి నే ఛాతివిరచు
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 10

తే॥ గీ॥ పొగలబండిని మొదట నే పోల్చలేక
వింతజంతువుగా నెంచి వెరగుచెంది
ప్లాటుఫారము వదలి నే పాఱునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 11

తే॥ గీ॥ కలల కన్నట్టి కమ్మని కథలనెల్ల
మూకచిత్రాల తెరమీద మొదటిసారి
చూపు నిగిడించి వేడ్కతో చూచునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 12

తే॥ గీ॥ పసుపు బట్టలు ధరియించి పసిమిమీర
పంచశిఖలు శిరమ్మున వరలుచుండ
భిక్షుదండంబు చేబట్టి భిక్ష వేడు
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 13

తే॥ గీ॥ పసిడివడిని వడివడిగ బడిన పయిడి
తడవు దొరకిన తెగబడి తడిమి తడిమి
నిజగణన గణితగరిమ నియతి నిలచు
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 14

తే॥ గీ॥ నిజపురోహితు డేకాంత నియతి జేయు
విమల గాయత్రిబోధనల్ వినిన యంత
వింత వెలుగులు నాలోన వెలుగునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 15

తే॥ గీ॥ తప్తచక్రాంకనము జేసి తాప ముడుప
మాధవు తిరుమంత్రమువకు మరుగు తెలుప
భక్తి మద్గురుపాదాల వ్రాలునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 16

తే॥ గీ॥ రంగనాథుని సన్నిధిన్ రంగరాజ
"రంగ రంగా" యటంచును రాణ యొప్ప
చిలుక పలుకగా నాగుండె కులుకునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 17

తే॥ గీ॥ శేషపర్యంకమున తన సిరినిగూడి
రంగనాథుడు నను జేరి రమ్మటంచు
అభయమొసగ నేరానంద మందునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 18

తే॥ గీ॥ పేరోలటి యయినకతన పేర్మిమీర
మందదరహాసచంద్రికల్ మురులు గొలుప
కొసరి నామీద రంగయ్య విసరునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 19

తే॥ గీ॥ జనులు వైకుంఠధాముని కనుటకొరకు
ఇసుక వేసిన రాలక కిసుకులాడ
నలుసునై యూపిరాడక నలుగునాటి
తియ్యదనము తిరిగిరాద తిరుమలేశ ! 20

తే॥ గీ॥ పరుగుపందాలలో నేను పాలుగొనుచు
ప్రేక్షకుల పొగడికలచే వేగ మలర
వాయువేగాన ముందంజ వేయునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 21

తే॥ గీ॥ పాఠశాలోత్సవముల నే ప్రతిభ జూపి
డెందమున సంతసము పెల్ల సందడింప
ప్రథమబహుమానతతులను బడయునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 22

తే॥ గీ॥ అఖిలభారత చెడుగుడి యాటలందు
ఎదుటిపక్షము నను బట్ట నెగిరి దూకి
గిరికొట్టి మరపువోలె బిరిని జేరు
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ! 23

తే॥ గీ॥ పెద్దసెలవుల మేమంత పిచ్చురేగి
తాతగారింటిమీదను దాడిజేసి
ఊరగాయంత నుప్పున నూదునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 24

తే॥ గీ॥ క్రొత్త కాల్వలో మేమంత గ్రుంకులాడి
పైరుగాలికి బట్టల నారబెట్టి
పొలముగట్టున బారుగ పోవునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 25

తే॥ గీ॥ బండ్లలో పెండ్లికేగెడి పయనమందు
చెరువుగట్టున గలగల చెలువుమీర
రొట్టలేయుచు చల్దులన్ గొట్టునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 26

తే॥ గీ॥ చెన్నపట్టణమందున చదువునపుడు
చలనచిత్రాల దర్శింప జట్టుగట్టి
అర్ధరాత్రులు మేమంత యరుగునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 27

తే॥ గీ॥ చందురు గిలిగింతలకు బల్ చిందులేయు
తరగ నురుగుల మెరపుల తళుకులొలుకు
కన్యపడుచుల బీచి నే కాంచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 28



తే॥ గీ॥ ప్రథమశ్రేణిలో నేనేట ఫలితమంది
పట్టభద్రుడన్ పట్టాబు బడయ మురిసి
బంధుగుల యభినందన లందునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 29

తే॥ గీ॥ అయిదువందల దండెము లలయకుండ
దానికిన్ మించి బస్కీలు దమ్ముపట్టి
బిగువుగొట్టుచు నే నొడల్ పెంచునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 30

తే॥ గీ॥ కండరమ్ముల బిగియించి కంటియెదుట
నిలువుటద్దము నుంచుక నిలచి నేను
'పోజు' లెన్నెన్నొ పెట్టుచు పొంగునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 31

తే॥ గీ॥ పాము గని నేను పొలములో పారజూడ
పల్లెపడుచు నగి "తగున భయము దొరల"
కనుచు ననుబట్టి తనవెంట గొనిననాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 32

తే॥ గీ॥ ప్రణయచంద్రుడు తనకాంతిప్రభల విసరి
నాదు హృదయమే ముదము ప్రమోదమంది
మల్లి విరిసి పరిమళమ్ము విసరునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 33

తే॥ గీ॥ పెండ్లిచూపులకై వారు వేచియుండ
సూటు బూటును ధరియించి సోకుజేసి
నాయకునటు నే నిటునటు నడచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 34

తే॥ గీ॥ ఫ్లాషుబల్బుకెమేరాల ఫ్లాషులోన
ముగ్ధ ముసిముసినగవుల మురిసిపోవ
కలికికంఠాన నే తాళి కట్టునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 35

తే॥ గీ॥ మూగమనసుకు ముసుగేసి మూలదాగి
ఓరజూపుల నొలకించు ఉవిదజేరి
సరససల్లాపగతుల నే చనువుజేయు
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 36

తే॥ గీ॥ "హనీమూనుల" విహరించి హాయినొంది
ప్రణయశృంగారనౌకలో పయనమంది
తేనెవాకల తొలిసారి తేలునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 37

తే॥ గీ॥ ఇంట కిటకిట చుట్టాలు ఇగురులాడ
సతికి వలపున పలుమారు సైగజేయ
వేళ కాదంచు విసవిస వెడలునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 38



తే॥ గీ॥ నోటినిండుగ విడియము నూటలూర
నడుముకట్టును బిగియించి నాతి నాకు
బిడ్డ నందించువేళ నే బిడియమందు
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 39

తే॥ గీ॥ చిన్నప్రతియె నామూర్తికే చిట్టిబొట్టె
జీవరాశిని సృష్టించు జీవశక్తి
కలదు నాకంచు నామతి తలచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 40

తే॥ గీ॥ వేదికన్ నేను గళమెత్తి వేడ్క మీర
పరవశమ్మున పాటను పాడునపుడు
శ్రోతలందరు ముగ్ధులై సొక్కునాటి
తియ్యదన మెప్డు కోరెద తిరుమలేశ ! 41

తే॥ గీ॥ మొదటిపద్యమున్ గోష్ఠిలో మొదలుపెట్టి
పిరికిదనమును క్రమముగా విసరిగొట్టి
సభను విస్మయమ్మొనరింపజాలునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 42

తే॥ గీ॥ ప్రణవనాదమ్ము దశదిశల్ వ్యాప్తిజెంద
తాంగిట తక తోంకిట తక తాళగతుల
ఇంపుగా మృదంగంబు వాయించునపుడు
తియ్యదన మెప్డు కోరెద తిరుమలేశ ! 43

తే॥ గీ॥ నాడు హృదిలోన నెచ్చటో నాట్యమాడు
ఆత్మదేవుని నేను వెన్క ననుసరించి
గగురుపాటున తొలుత నే గాంచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 44

తే॥ గీ॥ నాడు డెందాన విచ్చలు నాట్యమాడు
రామమూర్తి నే రచియింప రాగమొప్ప
జీవమున్ దాల్చి వాడు నన్ చేరునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 45

తే॥ గీ॥ మొదటిజీతము వెచ్చించి మురిసిపడుచు
క్రొత్త బట్టలు కొని తెచ్చి కోర్కెదీర
తల్లిదండ్రుల కేనిచ్చి తనియునాటి
తియ్యదనము తిరిగి రాద తిరుమలేశ ! 46

తే॥ గీ॥ దండి సత్యాగ్రహమునందు దాడు జేరి
జయజయధ్వను లెగయ నే జంకులేక
ఉప్పు గుప్పెళ్ల జేబట్టి యురుకునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 47

తే॥ గీ॥ వేయి "వాలంటిరు"ల బాస్ల వీథులందు
నడుగు తప్పక విసవిస నరుగునపుడు
నాయకుడుగ నే మానుముందు నడచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 48



తే॥ గీ॥ భారతాంబ దాస్యమ్మును బాపుకొరకు
వాడవాడల నెండల వానలనక
తిండితిప్పలు మరచి నే తిరుగునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 49

తే॥ గీ॥ దేశసేవను గావింప దీక్షబూని
బంధిఖానాల నింతయు బాధయనక
పెండ్లివారిసందంబున వేడ్క జేరు
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 50

తే॥ గీ॥ విజయగీతులు వీథుల విస్తరింప
స్వాగతంబుగ ప్రజలెల్ల సాగివేయు
పూలమాలలు మెడనిండ పొలచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 51

తే॥ గీ॥ మూడువత్సరాలు గడిచె ముద్దులొలుకు
నాకు బొట్టెన్ ముద్దిడి నాడు తిరిగి
అలుబిడ్డల గూడి యానందమందు
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 52

తే॥ గీ॥ కోడికూతకు మేల్కాంచి కాడిగట్టి
జలపు పెరుగున కలిపి నా పడతిగట్టు
కూడు నే కోడిగట్టున గుడుచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 53

తే॥ గీ॥ రంగురంగుల కోకల రమణులంత
పైకి బిగగట్టి వరుసగా పైరులూడ్వ
కనులపండువై నే నిల్చి గాంచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 54

తే॥ గీ॥ వంద కోకిల లొకసారి పాడినటుల
పడతులందరు చేనులో పాడినంత
మోననాటిన వెంటనే మొలకలేయు
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 55

తే॥ గీ॥ కలుపుదీయంగ పొగరెక్కి కాంతినెగసి
రోజురోజుకు నాచేలు రూపులెత్తి
దుబ్బుజేయంగ నేనెంతొ నుబ్బునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 56

తే॥ గీ॥ పరవు మందాన పొలమంత పనలు నిండ
కాలువేసిన గింజలు ఘల్లుమనగ
గర్వమందుచు నే చేను గాంచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 57

తే॥ గీ॥ బారకాసుల తలపించు బార్లదీరి
మేడివాములు మడుల నే మెరయజూచి
కొట్లునిండు నీయేడంచు కులుకునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 58



తే॥ గీ॥ కుప్పనూర్పిడిసమయాన గూడుజేసి
చందమామను గాపుంచి సద్దులేక
గడ్డిలో దూరి నే కలల్ కనిననాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 59

తే॥ గీ॥ రాశితోడ నాయానందరాశి పెరుగ
పొడుగు పొలికేకకున్ మేను పులకరింప
త్రివ్విన కొలంది రాసులు కొలివ్వునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 60

తే॥ గీ॥ వల్లబండి బురదదిగ బట్టినపుడు
కండరమ్ముల పుష్టిని కలిపికట్టి
పట్టుబట్టి నే గట్టుకు నెట్టునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 61

తే॥ గీ॥ అంచనాలకు మించిన మంచిపంట
సంచులన్ పంచకున్ జేర్చి సర్ది సర్ది
కొట్టు పట్టక పురులు నే గట్టునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 62

తే॥ గీ॥ పట్టుచీర నాభార్యకు కట్టబెట్టి
పిల్లవారిగ దుస్తులు పిలిచి తొడిగి
సంకురాతిరి మేమంత సల్పునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 63

తే॥ గీ॥ భజనస్తంభమ్ము చుట్టును భక్తితోడ
పల్లెవాసులతో జేరి పట్టుతోడ
చెక్కభజనలు చకచక సేయునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ! 64

తే॥ గీ॥ కన్నవారింట కులుకు నాకలికి కూడ
మూడువందలమైళ్లుగా ముందుకరుగు
ధూమశకటంపుజాగు నే దూరునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ! 65

తే॥ గీ॥ నీలగంభీరజలధిలో నింగికెగయు
వరతరంగాల కెదురుగ బెరుకు వదలి
పడవ నడుపుచు నెగబడి కదలునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ! 66

తే॥ గీ॥ కొండలెక్కుచు గబగబ గుండెలదర
కాళ్ళు చిడిముడి తడబడ కదలలేక
ఏడుకొండలవానినిన్ వేడునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ! 67

తే॥ గీ॥ భక్తరక్షక! యాశ్రిత పారిజాత!
దీనమందార కావుమీ దీను ననగ
చేమొసగి నీదు గుడికిని చేర్చునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ! 68



తే॥ గీ॥ కొండశిఖరాన ఠీవిగా కొలువుదీర్చు
పర్యవేక్షణాదక్షునిన్ పదము బట్టి
పారవశ్యమ్ముతో నేను పాడునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ! 69

తే॥ గీ॥ దిగువ కొకసారి నాచుట్టు దేరజూడ
విశ్వమంతయు నాముందు విస్తరింప
అల్పుడే నంచు కైమోడ్పు సల్పునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ! 70

తే॥ గీ॥ కొండశిఖరాల తలదన్ను గొంకువీడి
నురుగు గ్రక్కుచు సుడులతో నురకలేయు
ప్రపాతజలపాతరవళి నే పొంగునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ! 71

తే॥ గీ॥ రంగు హోమున బూసుక రాజునగుచు
తమకిగప్పిన కోటును చమటకోర్చి
ఏవి ధరియించి నటియించి తేజు మెరయు
తియ్యదనము మరువగలన తిరుమలేశ! 72

తే॥ గీ॥ వీరకంఠాన నిజసతి యేను గూడి
ఆస్త్రదైవము వెన్నుని నింపుమీర
తిరువనామాలు పాడుచు వేడువేళ
తియ్యదనము మరువగలన తిరుమలేశ! 73

తే॥ గీ॥ బడలి సడలి నేనింటికి వెడలిరాగ
అలసినారంచు నాసతి యుందజేయు
ఆవుపాల నే వగవగ నానువేళ
తియ్యదనము విడువగలన తిరుమలేశ ! 74

తే॥ గీ॥ అలఘు మలబారు శిఖరాన నలరుచున్న
సుందరోద్యానవనముల సొబగుజూడ
నందనవనము గనిన నానందమందు
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 75

తే॥ గీ॥ లక్షమందిజనము క్రమ శిక్షణముగ
తాళమును వైచి భక్తితో తనువు మరచి
'బాపు' ముంగల నామమ్ము పాడునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 76

తే॥ గీ॥ యోగవిన్యాసములు జేయ యోగివరుడు
'భావే' ముదమున వీక్షించి బాగు యనుచు
మమ్ము దీవింప యొడలు నే మరచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 77

తే॥ గీ॥ అఖిలభారతగోష్ఠిలో నద్భుతముగ
ఆసనముల ప్రదర్శింప నచటి ఘనులు
మెచ్చుకొనగ నాయాశలు హెచ్చునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 78



తే॥ గీ॥ రాజభవనమునందున రాష్ట్రప్రభువు
యోగివరుల సన్మానింప సాగివచ్చి
అభినుతుల మాకు నీయ మే మందునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 79

తే॥ గీ॥ పూర్ణచంద్రుని వెన్నెలల్ పోగుజేసి
పాలరాతికి పూతగా పైన పూయ
తాజు తేజము తనువు నుత్తేజపరచు
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 80

తే॥ గీ॥ ఎటులకనె నహా షాజహాన్ నిట్టికలను
కనిన కల నెటు గట్టిగా కట్టినాడో !
కట్టినట్టి కట్టడము నే కనిననాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 81

తే॥ గీ॥ నాతిమీదను వలపంత రాతబోసి
వలపుపొంగుల్ పాలరాల్ చెలగె నవ్వి
తలచి పొలచిన తాజును తలచునాటి
తియ్యదనము విడువగలన తిరుమలేశ ! 82

తే॥ గీ॥ మొగలుసామ్రాజ్య వైభవాల్ మోసులెత్త
[illegible]సామ్రాజ్యవిభవ లెల్ల విచ్చేరిల్ల
తాజ తేజము తనువెల్ల తాకునాటి
తియ్యదనము విడువగలన తిరుమలేశ ! 83

తే॥ గీ॥ తాజు[illegible] భక్తితో రాత్రిబవలు
[illegible] కనులార కనినచోట

దక్షిణేశ్వరమును నేను దరియనాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 84

తే॥ గీ॥ సర్వమతసమరసభావ సాధనమున
సకల దేవతారాధన సలిపె నచట
పంచవటిలో ప్రశాంతి నే గాంచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 85

తే॥ గీ॥ గంగదాటి బెలూరులో గాలుపెట్ట
అందు నానందులు కనుల విందుజేయ
డెంద ముప్పొంగి ఆనంద మందునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 86

తే॥ గీ॥ గురునిపేర మఠము నెలకొల్పినాడు
అనఘు డావివేకానందు డందమలర
ఆ పవిత్రాత్మ నాడెంద మావరించు
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 87

తే॥ గీ॥ ఆదిశక్తియె యవనిలో నవతరించె
కాళిఘాట్టున దయనునాన్ కళలవెలయు
కాళిమాతను కనులార గాంచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 88

తే॥ గీ॥ బదరి కాదిని హిమరాసి చదరియయిన
దేవదేవుని పాదాల దివ్యరుకొరకు
వెండికొండల నెగబ్రాకు వేళ పొందు
తియ్యదనము మరువగలన తిరుమలేశ. 89



తే॥ గీ॥ లోయలో దాగి యోగిన్నై లోతుగలిగి
శాంత గంభీర తలముల కాంతులీను
మానససరోవరమున నే స్నానమాడు
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 90

తే॥ గీ॥ తగిన వరుని వెతకి తెచ్చి తనయ నొసగి
పెండ్లివారికి ఘనమైన విందులిచ్చి
గొంతుకలు బొంగురులువోయి గొణుగునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 91

తే॥ గీ॥ చేత రాకయు చంటిని జేతబట్టి
తాత చూడంచు మెల్ల నాదరికి జేరు
కన్న కూతును కనులార కనిననాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 92

తే॥ గీ॥ కన్న కొడుకును కూతురు కన్నసుతుల
తగవులాడుచు గడబిడ తరుముకొనగ
మనుమలను పక్షపాతాన పెంచునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 93

తే॥ గీ॥ షష్ఠి పదివత్సరములు సేవ నేను
బాసులను పెట్టు బాధలు రోసి నేను
బంధములను కోసి బయలుపడ్డనాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ! 94

తే॥ గీ॥ [illegible] తీర్చి వెలువడ్డ పక్కివోలె
[illegible]సంగీత సాహితీసరసజగతి

తిరిగి నేనుగా నుదయించి తిరుగునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 95

తే॥ గీ॥ రాజు నేడైన రేపగు రైతు నేడు
కలముబట్టినవా డెల్లి కాడిబట్టు
కలము వీడి పొలముదున్న గడగునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 96

తే॥ గీ॥ వివిధదేశాల నే బహు విందులంది
హైందవఘన విజ్ఞానమ్ము నందు జల్లి
మాతృభూమికి పేరుతో మరలునట్టి
తియ్యదనము పొందు టెపుడు తిరుమలేశ ! 97

తే॥ గీ॥ బహుముఖంబగు ప్రతిభలు ప్రజ్వరిల్ల
విశ్వశక్తిలో నాశక్తి వీసమనుచు
కనులు తెరచి తెలిసికొన కలుగునాటి
తియ్యదనము మరువగలన తిరుమలేశ ! 98

తే॥ గీ॥ వానప్రస్థంబు గ్రహియించి వాంఛ లడిగి
నియతి నేకాంతసేవలు నేను జేసి
పరమభక్తితో కీర్తనల్ పాడగలుగు
తియ్యదనము పొందు టెపుడు తిరుమలేశ ! 99

తే॥ గీ॥ భవజలధి రోసి తరియించి బాధ లుడిగి
అతులనియతి విషమతతి నధిగమించి
యతి నగుచు పుణ్యతీర్థాల యాత్రసలుపు
తియ్యదనము పొందు టెపుడు తిరుమలేశ ! 100

తే॥ గీ॥ కరుడుగట్టిన యలవాట్ల కట్టగట్టి
సంహరించియు మనసున శాంతినొంది
ఆత్మసామ్రాజ్యపదము నే నందునాటి
తియ్యదనము మఱవగలన తిరుమలేశ ! 101

తే॥ గీ॥ కాలినడకల నూరూర గ్రాలుచుండి
రామభజనలు జేయుచు రాత్రిబవలు
తనువు మరచి నే నిశ్చింత తనరునాటి
తియ్యదనము పొందు టెపుడు తిరుమలేశ ! 102

తే॥ గీ॥ కామరహితమౌ నిస్స్వార్థకర్మ జేసి
శక్తులన్నియు నే విశ్వశాంతికొరకు
అర్పణము జేసి యానంద మందునాటి
తియ్యదనము పొందు టెపుడు తిరుమలేశ ! 103

తే॥ గీ॥ కవులు తెలిచిన మొదలుగ కలలుకంటి
మధురానుభూతు లనెన్నొ మదిని నిలచె
వాని నన్నింటి కవితలో వ్రాయగలుగు
తియ్యదనము పొందు టెపుడు తిరుమలేశ ! 104

తే॥ గీ॥ కలుక తిరముగాని యలఘు భావతతుల
తెలుగు పలుకుల కులుకుల చిటుకుచిటుకు
తేట తెలుగున వెల్లువ తెలుపగలుగు
తియ్యదనము పొందు టెపుడు తిరుమలేశ ! 105

తే॥ గీ॥ ముద్దుపలుకుల ముత్యాల మూటగట్టి
మూడుపాదాలలో మూర్తి ముడిచిపెట్టి
తిరుమలేశుకు మకుటంబు తీర్చునాటి
తియ్యదనము నిలుపుమయ్య తిరుమలేశ ! 106

తే॥ గీ॥ కలము బట్టించి దానిలో కవితబోసి
దరిని గూర్చుండి దయశోత ధార నొసగు
కమలనాథుని నిను కన గలుగునట్టి
తియ్యదనము నిలుపుమయ్య తిరుమలేశ ! 107

తే॥ గీ॥ తేటగీతుల సరుల నే తెగువజేసి
తిరుమలేశ నీకర్పింప దేవిగూడి
చిరునగవు లెన్నొ నామీద చిలుకునాటి
తియ్యదనము నిలుపుమయ్య తిరుమలేశ ! 108

ముగింపు.

తే॥ గీ॥ కటికచీకటిని గనదు కాంతిరేఖ
దుర్భరక ఘోరఘోషలో దొరకు శాంతి
పరమపావన మ్మగు పాప పంకిలమ్ము
తెరను తొలగించి నను జూడ తిరుమలేశ !

శ్రీ విజయలక్ష్మి పవర్ ప్రెస్, భట్నవిల్లి.
ఫోన్ : 342 అమలాపురం.

ఓమ్.

శ్రీ శేషశైలవాసాయ నమః
శ్వశ్రేయస మస్తు.

# విశ్వశాంతి

విశ్వకల్యాణ మొనరింప విధి యటంచు
విశ్వవీథుల విహరించి వెదకి యేను
చిత్తమున క్రొత్తభావాలు చిగురులెత్త
కథగ నల్లుచు గీతను కలయంబోసి
విశ్వశాంతికి మార్గంబు వెల్లడింప
విశ్వవిభుదయ వ్రాసితి "విశ్వశాంతి"

## అంకితము

విశ్వశాంతికై వినువీథి వెడలివచ్చి
గాయకాకారము నల్పిన నాయకుఁడవు
శ్రీల విశ్వాత్ముడవై వమ్మ నీరజాప్త!
అంకిత మొనర్తుఁ గైకొను మయ్య! దీని.

— అద్దంకి శ్రీరంగాచార్యులు.